పరిచయము

మెయిళ్ళకాల్వ మఠాధ్యక్షులు కీ॥శే॥ వుశేన్‌గారి
మనవడు వంశస్తులు



ఈ పుస్తకమును ప్రింటు వేయించినదాత :

**జనాబ్ చెన్నూరు మహబూబ్ పీరా**

దర్గా అధ్యక్షులు
ప్రొద్దుటూరు, కడప జిల్లా.



ఓం

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమ:

మె యి ళ్ళ కా ల్వ

# శ్రీ వుశేనయ్యగారి తత్వములు

ఈ పుస్తకమును ప్రింటు వేయించినదాత :

**జనాబ్ చెన్నూరు మహబూబ్ పీరా**

దర్గా అధ్యక్షులు
ప్రొద్దుటూరు, కడప జిల్లా.

(నేమనూరు వుశేనయ్య,
మెయిళ్ళకాల్వ వుశేనయ్య ఇద్దరూ ఒక్కరే)

ముఖ్య గమనిక

భక్తాగ్రేసరులగు హిందూ మహమ్మదీయ సోదర సోదరీ మణులారా! యిందువ్రాయబడి వుండు పీఠిక పూర్తిగా చదివి తర్వాత పుస్తకమును శాంతముగా చదువుదురని మా విన్నపము



# పీఠిక

శ్రీశ్రీశ్రీ పరమహంసా పరిపూర్ణులగు విశ్వబ్రహ్మ మొయిళ్ళకాల్వ వెంకటనారాయణ పరబ్రహ్మేంద్రస్వాములవారి ప్రియశిష్యుండు శ్రీ పరవిశ్వ దేశికేంద్ర పంచానన వృద్ధుపుండును. దశదళమధ్య శ్రీ వేదాంతజ్వాల బింబా యమాన నాదుబిందు కళాసందర్శన వుత్తరశాంభవీ అమనస్కయోగ నిష్ఠా గరిష్ఠుండును అఖండమండలాకార సచ్చిదానంద మహాప్రణవ పంచాక్షరీ అవిరళజ్యోతి స్వరూపుండును రాజయోగానందుండును నిరంతర గురుపూజ నిష్ఠాగరిష్ఠుండును అష్టాంగయోగ అణిమాద్యష్ఠ త్రివిధ ప్రాణాయామపంచము ద్రావిలక్షితుండును అగు మొయిళ్ళకాల్వ శ్రీ వుశేనయ్యగారి తత్వములు ఇంతవరకు అచ్చుపడి వుండలేదు. ఇప్పటికి షుమారు 200 సంవత్సరముల నాటి చరిత్ర అయినందువల్ల గ్రంధము శిధిలమైవున్నందువల్ల ఇప్పటికి మా వద్దవుండు తత్వములు ముద్రించియున్నాము. ఇంకను వెదికి మూడవకూర్పు నందు తత్వములు చేర్చగలమని ఆశించుచున్నాము.

ఓం.

## సద్గురువేనమః

భక్తజనులారా! యెన్నియో జన్మములయందు చేసినపుణ్యము, పరిప
కమగుటచేత మనకీ మానవజన్మము లభించినది. అయినను మనము ఈజన
ములో సరిఅయిన మార్గము కనుగొనజాలక పరితపించి మాయమోహితు
దేనినివిడిచినను ఆశనువదలలేక పాపకర్మలచేత చచ్చుచు, పుట్టుచు సముద్ర
తరంగములవలె మునుగుచు లేచుచు వున్నాము. వుదాహరణముగా తే
అతిమధురముగావుండు వస్తువుగదా ఆ మధురమునకు ఆశించి తాను అంద
లో చిక్కి తప్పించుకొని పోవుశక్తి తనకు లేదని తెలిశికూడా యీగయే
చేయుచున్నది? తనతొండమువాచి కొంచెము తే నె ను సంగ్రహించుకొ
పోవుదునను తలంపున తొండమునువాచి అందులో యిరికించుకొని దానినివ
లించుకొనుటకు ముందు కాళ్ళను తర్వాత వెనుకటికాళ్ళను ఆ తర్వాత రెక్క
లను యిరికించుకొని తుదకు ఆ బంధమును యిడిపించుకొనలేక తన ప్రా
ములను వదలుచున్నది. కాని ఆ మధురమును విడువలేకయున్నది. మా
వుడుకూడ ఆశ మధురమైనదిగనుక దానిని విడువలేక పరితపించుచున్నాడు
దానివదలవలయునన్న జ్ఞానమలపడవలయును. అందుకుకొన్ని సాధనములు
యోగింపవలయును. అందుముఖ్యమైనది సత్యము ద్రవ్యసహాయమక్క
లేక శరీరకష్టమేమియు లేకయే సాధింపబడువస్తువు సత్యమొక్కటియే ఎ
ప్పుడు నేను సత్యమునే పలుకుదునని యే మానవుడు ప్రమాణ పూర్వకమ
గా నిలచివుండునో వానికి అందువల్ల ప్రథమములో దుర్ఘటమైనవి, కా
శులభమైనట్టివికాని కష్టములురావచ్చునుకాని తర్వాత సూర్యరశ్మికి మబ్బు
దూరమగునట్లు సత్యవ్రతముచేత సర్వకష్టములు తీరును. సర్వపాపకర్మమ
నశించును. సత్యమనుమాట ప్రతి మానవునికి తెలిసినవిషయమే గనుక వాలా
చౌకగా అగుపడుచున్నది. కానీ అందులోనుండు బలమును గ్రహింపవ



యున్న అనుభవజ్ఞులకే తెలియునుకాని అందరికి తెలియదు. నేను సత్యమునే పలుకుచున్నానని ప్రతి మానవుడు తలంచవచ్చును కాని సత్యమును పలుకుట దుర్లభము. సత్యము పలుకువారి మనస్సు మలినములేక శుద్ధమైయుండును. గనుక వారికే జ్ఞానము కలుగును. జ్ఞాని పుణ్యపాపములనెడి బంధముల తెలుసుకొని చేయరానిదేమి చేయవలసినదేమి అను తెలంపు పుట్టి తన్ను తాను తప్పించుకొనుచుండును. అందును కొంత సామర్థ్యము కలుగును. అట్లు పరబ్రహ్మమునందు చిత్తమును లగ్నముచేసి ధ్యానముచేయు రహస్యమి నెరుంగజాలక ప్రకృతివశులమై జనన మరణమైన సంసారమును పొందు చున్నాము. కాబట్టి యీ అనుభవము నెరింగి సాధనచేయువారు బాగుగా ప్రజ్వలించు అగ్నికట్టెలను భస్మముచేయునట్లే జ్ఞానమనెడిఅగ్ని ఆగామి, సంచిత ప్రారబ్ధరూపములు సమస్త కర్మలనెడి కట్టెలను సంపూర్ణముగా భస్మముచేసి అంత్యమున జన్మరాహిత్యమనెడి పరమపదమును పొందగలరు. వేదాంతమును విన్నవారికంటె కన్నవాడధికుండు కన్నవానికంటె కలియువాడధికుండుఅని వేమనార్యులు నుడివియున్నారు. యోగమనగా (కంటితో చూచుటకుగాని మనస్సులో భావించుటకుగాని వీలగుసృష్టిలోని యేదోవకపదార్థము) నాధారముచేసుకొని దానిమూలమున నిర్గుణుడగు పరబ్రహ్మమునందు మనస్సు నిలుపవలెనని బ్రహ్మసూత్రము చెప్పుచున్నది గనుక అనేకవుపనిషత్తులు పురాణములు మొదలగు వేదాంతగ్రంథములు బోధించుచున్నవి. గనుక జ్ఞానులైన మహాత్ములు తుదకు జన్మరాహిత్యమొంది పరమపదమును పొందగలరు

ఇట్లు, భక్త జనపాదసేవకులు,
షేక్ హుసేన్‌పీరాసాహెబ్, బద్వేల్.
మతాధ్యక్షులు
షేక్ హుసేన్‌వలి

మొయిళ్లకాల్వ
హుశేనయ్యగారిమఠము
25—1—1990

7



# తత్వములు

## గురుపూజవేళ చెప్పిన తత్వము

పూలుగోతమా గురునిపూజచేతమా శివా పూలుగోతమా శివుని శేవజేతమా ॥పూ॥

పూలుగోతమా మంచిమెలిమైన గురునిబోధ - సాలుమూలలను ౽ తగిలియున్న చేతులతో ॥పూ॥ భంథమూలు యూడబొడిచి భాష మందునిలచి చందమామయున్నచోటు సరణి తెలుసుకుంటమనము॥ష గాలిరాకపోకతెలిసి ఘన శితాకాశమందు ఫాలరాశిలోన శివుడు వాలాడుచున్నవేళ ॥పూ॥ కూడికుంభకంబుమీద జోడుహంసల జాడతెలో మేడమీదికల్లుత్రాగి మేనుమరచియున్నవేళ ॥పూ॥ మండలంబుమీరి మాశిరులు చెన్నునితోగూడి పుండరీకమైనపాండు భవుని మ్రింగు... టు మనము ॥పూ॥ ద్వాదశాంగుళంగుమీద ద్వారలొలుకగాను చూచి పాదుపీఠమెక్కిశివుడు ప్రణవమాలకించువేళ ॥పూ॥ హరుడునారాయణయ్య ఆత్మసేవలోనయపుడు సదాశివా పోతులూరు శంఖరునిపూజ వేళ ॥పూ॥

## తత్వము

యంతమంచి గురుడుదొరికెనే - వోయమ్మలారా యంతమంచి గురుడుదొరికెనే॥

యంతమంచి గురుడుదొరికె అంతరంగమందునన్ను చింతలేక గురుని పాదం చెంతనచేరుండుమనవె ॥యం॥ కన్నులువీనులుమూశి గాలిరాక

పోకతెలిశి పున్నమవెన్నెల కన్నుతెరవిమాడుమనెనె ॥యం॥ పంచకోశ మూలాలువారి పంచముద్రిల్లరోశి పంచవింశతి తత్వపూవల బట్టబయలు చేరుమనెనె ॥యం॥ [పరమహాత్ముడు వుశేనయ్య బ్రహ్మమైనారాయ ణయ్య ధరణిలో శివపోతులూరు] దైవరాయుడొక్కడనెనె ॥యం॥

వచనము

యీమహాత్ములు గురువుగారి వుత్తర్వుమేరకు పంచెండు సంవత్సర ములు దేశసంచారము చేయుచు అప్పటప్పట తన దివ్యమహిమలు చూపించి యున్నారు. అందులో కొన్ని యిప్పటికి దృష్టాంతముగా కానబడుచున్నవి తాను సంచారముచేయుకాలములో ప్రొద్దుటూరు తాలూకా కొత్రపాటి గ్రామ ములో స్త్రీలు రాటములు పెట్టుకొని యేకులు వడుకుతూవుండగా దారినపోతూ అమ్మా మంచినీళ్ళు యిచ్చెదరా అని అడుగగా వారు మాకు పనివున్నది నేను యిప్పటకు వీలులేదని హేళనచేయింప క్రిందవ్రాసిన తత్వమును జెప్పినారు. ఆ తల్లులు వడుకుచున్న రాటములు యెక్కడివక్కడ నిలిచి పోయినవి.

తత్వము

యేకులువడికె పెంపైనకాళింపైన మీరెరుగరుగా ఆరుఆకుల రాటంపడిపై ఆకాశంబది ఆరువగనూ కారణమైన కదురుబెట్టుకొని కను సైగతో యేకందుకును భావములోపుల గరువముద్రుంచి భావములో దారతుకుచునూ సాక్షమైన సంసారములోపుల సరసుల కాపురమందు చునూ ॥యే॥ మరుపుతెరుపు యీ రెండుస్తంభములు మాయలో మాయ కలుపుచును యెరుకగలిగి గురుపీఠముమీద యేకముద్రతానెంచుచును నిర్మలమైనపట్టెమీద తానిలుకడపాటం పెట్టుచును గురుమంత్రంబనె



సాకెరూశత గురిల్లో గురితాగల్పుచును ॥యే॥ మనసురోశి యీ నాలుగు ప్రతిమలు మనను యిరుసుతాజేయుచును యనసిత్రిప్పిన త్రిప్పుడుబొమ్మ విశ్వములో చెయ్యందుచును [అనుకొని నా రామాయణమంత్రం వేద సారమని యంచుచును అనుదినమును శివపోతులూరు మన అయ్యను మదిలో తలచుచున్నూ ॥యే॥]

వచనము

శ్రీవారి గురువుగారగు వెంకటనారాయణవీరబ్రహ్మంగారు భార్యసమే తులై పుష్పగిరిక్షేత్రమునకుపోవుచు శిష్యుని పిలుచుకొని పోదమా అని భార్య ను పందలింపగా వారు యింటిదగ్గర యెవ్వరులేరు యిక్కడవుంచిపోదామని చెప్పిరి. సరియని వారుపోయి ఆ క్షేత్రముదగ్గర చింతవనములో వంటప్రయ త్నము చేయుచు అది వసంతఋతువుగాన వృక్షములు చిగురించి అందముగా వుండినవి అప్పుడు అమ్మగారు మనవుశేనయ్యవుండిన మంచి చిగురువున్నది కోశితెచ్చిన కూరచేయుటకు బాగుండుననగా శ్రీగురువుగారు నీవేకదా రాని వ్వనిది అనినంతనే ఆ చెట్టుపైననే శ్రీగురుధ్యానపరుండై క్రింది తత్వమును చెప్పినారు.

తత్వము

చిగురోయమ్మ చింతచిగురో చిగురుగోనరే మాయవగరుదీసినాది పగలురేయి పక్క భావమైనచింత ॥చి॥ తాను నేననెమాయ తలచిందె చింత తనువు మేరువునెక్కి చూచిందెచింత దినముతెలిసి ద్రేహంమర చిందెచింత అనుదినము మాధుర్యమనుభవించినచింత ॥చి॥ గురువేప రంబని కొలచిందెచింత గురువెదైవమని కొలచిందెచింత గురిలోన

గురితెలసి కుదిరిందెచింత మరిగిగురుశేషము మానిందెచింత ॥చి॥ చూపు మనసువకటి చేసిందెచింత సూర్యచంద్రులతెరవు కాశిందెచింత కాపు రానికి మంచి కలిగిందెచింత దాపుశివుని దారిజేరిందెచింత ॥చి॥ యడ తెగని పదవిలోయొగామెచింత నడినాళవీధిన నమ్మిందెచింత సుడితిరిగి ప్రణవము చూచిందెచింత ॥చి॥ మనుసే నారాయణయ్య మహమ్మదయి నచింత కనుగొన్నవిశ్వములో కలసైనచింత భానుశివపోతులూరు బ్రహ్మమందినచింత ॥చి॥

వ చ న ము

కమలాపురం తాలూకా రాయునిపేటలో కొన్నిరోజులు సంసారము చేస్తూవుండగా గంగజాతర వచ్చినది. అప్పుడు రెడ్డికరణం రైతులకు తీర్వ లుపేస్తూ కొత్తతురకవాడు వచ్చివున్నాడు వానికి తూమెడు అముదములు పెయ్యండి వండి అముదము యిస్తాడని చెప్పిపంపగా అముదములు తీసుక పోయి వారియింటిలో పేసినారు. కొత్త వారు వాండ్లకుకట్టెలు బానలు యక్క డివి అందువల్ల పూరికెవుండినారు జాతరటయములో అముదము తెమ్మనగా యక్కడి అముదాలేవున్నవి. అప్పుడు కరణంగారు మహాకోపోద్దీపితులైగంగ గుడిముందరికి యీడ్పించి తెప్పించి వంగబెట్టి అయిదుమూరల నిలువురాతిని వీపుమీదయెత్తించి శిక్షించినారు. అప్పుడు ఈ క్రింది తత్వముచెప్పగా దున్న పోతును నరకడమునకు బదులు కరణంగారినిఈడ్చి చాకలివాడు నరికి ద్వీపము వగైరాలు దున్నపోతుకు చేశినట్లు చేసినారు ఉదయం చూడగా కరణంగారి శవము తల అగుపడినది. శ్రీవారులేరు. ఇప్పటికి ఆ గ్రామములో గంగ జాతర చేయకుండా నిలిచిపోయినది. యిప్పటికి కాననగును.



త త్వ ము

రాయునిపేటలో చేరితిరాశివా రామలింగమనిరడవిస్తిరా రాతిరి పగలు గురునేమారకెప్పుడు రహస్యమనెడి బందాడితిరా శివ తాలిల్లె లిల్లెలో శివ తత్తరపడకుంటె తనయందెశివుడు ॥తా॥ ఆసాదిబయినేవు లాడుత శివయని హంకారమనె దున్నయీగుల్ త్రిప్పి హొంకారమనే కత్తి వక్కచేతనేపట్టి హంకరించినవాని ఆయమెంద్రుంతు ॥తా॥ యిడా పింగళకూడ పట్టితిరాలింగా విశ్వమంతయు మాయకప్పితిరా యన్న డుమురుగని రాయునిపేటలో అవ్వఅంకాళమ్మ నంటితిరాశివ ॥తా॥ నాలుగు శిలలుకమ్మి దీసినవ్రతము నడివీధిగంగకు సోహమని తొమ్మి దివాకిండ్లు తొలగకుండనుమూశి అమ్మయనకుతూరిఅరసిస్తిరాశివా ॥తా॥ చించితిరాలింగా మంచినీళ్లపొట్ట కర్మమనెటికాలు కరపిస్తిరా సృష్టివంటి ప్రతిమశిరసుమీదనెపెట్టి శివశివయనెజ్యోతి వెలిగిస్తిరాశివ ॥తా॥ యేడు పుట్లరాశివండి వీధిగంగకు యేడుకశివయని యరసిస్తిరా అట్టెఅయిటబట్టి దిట్టాంజేసుక బట్టబయట బలిసల్లిస్తిరాశివా ॥తా॥ [నారాయణనె కొమ్ము నాదితిరాశివ నాలుగువేదాల్ శోధిస్తిరా భేదాంతప్పక శివపోతులూరయ్య పాదాలపట్టుక పలికితిరాశివ ॥తా॥]

వ చ న ము

కడప తాలూకా కొక్కాయపల్లెలో భిక్షురాలువకఅమె శ్రీవారికి శిష్య రాలిగావుండినది. అమె గురుధ్యానపరురాలై వారిశుశ్రూష చేయుచుండెడిది. అమెకు ఒక కుమారుడుకూడకలడు. అప్పూరి రెడ్లసంఘముచేరి యెవ్వరో

తురకవాని యింటిలోపెట్టుకొని పెద్దలనిచెప్పుచున్నది. ఈమెను కులబహిష్కారము చేయవలెనని నిర్ధారణచేసుకొని బావికి నీళ్ళకు వచ్చినపుడు కడువపగులగొట్టి పంపమని అజ్ఞ చేసినారు యీ భక్తురాలికొమారుడు నీళ్ళకు పోతూవుండగా శ్రీవారు నాయన బావిదగ్గర కుక్కలున్నవి కరుస్తాయన్నారు. అమాయకబాలుడగుటచే-స్వామి మావూరి కుక్కలు నన్నేమిచేస్తాయనిపోగా అక్కడ కొందరువుండి కడవపగులగొట్టి పంపినారు. అప్పుడు సమాచారము తెలుసుకొని ఉగ్రుడైవచ్చిన అ అమాయకుణ్ణి సమాలించి క్రిందితత్వము చెప్పగా భక్తురాలియిల్లుతప్ప మిగతాపూరఅంతయు కాలి భస్మమై పోయినది. ఇప్పుడున్న కొక్కరాయపల్లె ప్రక్కన త్రిప్పికట్టుకున్నారని వాడుక.

తత్వము

మండలం కొకరాయపల్లెలో మహిమతెల్పినదైవమె సాయమౌ కొకరాయపల్లెలో సాంబశివుడై యుండునె ॥మం॥ చుట్టుమంటలు యగు రకమలము సూర్యపగలై యుండు నట్టనడుమహరునియిల్లు గట్టితానై యుండునె ॥మం॥ వూరిలోపిల్లాలు పెద్దలు వూర్పటించిలేతురె పారి గొర్లవలె ముల్పాకుదనుక పరువులెత్తుచువత్తురె ॥మం॥ వేడుకతో గృహములోనీ యెనిమిదిఏనుగులుపార్యాడునే మోక్షమూన ముసలియొక్కటి వేదంచదువునె ॥మం॥ కోడిపుంజులు రెండువక్కటై యేడుకొండలు దాటునె నట్టనడుమ నక్కపోతది నమ్మికలుతానిచ్చునె ॥మం॥ వాయు వరస లేనివనిత వకనిపాలై యుండునె అవిధంబున విశ్వమంతయు అణువులోచేరుండునె ॥మం॥ జంటకుంటెన కత్తెవక్కటి జాడయిదియని తెల్పునె కోడిగమునకోడిపిల్ల కొట్టిరక్తముత్రాగునె ॥మం॥ మెండ



మేఘము మేరుపుతళుకు మేషమొక్కటిమ్రింగునె వెయ్యిసిరసుల పాము వక్కటి వికవికాయనినవ్వునే ॥మం॥ దండిగుణముల ధాతవక్కడు రాతతానై యుండునె ప్రళయముగ కొకరాయపల్లెలో బ్రహ్మమైతానుండునె ॥మం॥ తెలియదెవ్వరికి దీనిభావముతేటపడు మరిఘనులకుతెలిసితె నారాయణయ్య తేటపడు మరిఘనులకు తెలిసితెతానుండునె అలరుచును శివపోతులూరుఅయ్య మహమ్మదు ఆయనె ॥మం॥

వచనము

శ్రీవారు వకపుడు మల్లెలకొండలో నుండివచ్చుచుండగా కొందరు దొంగలు వెంబడించగా వారికి తెలివితెచ్చుటకై తనవద్ద ధనముండినట్లు నటించుచుండగా అ దుర్మర్గులు వారిని ముట్టడించి ధనములేమింజూచి యచ్చట దాచితివని అడుగ తనదగ్గర యేమియులేదనిచెప్పగాకోపించి ఒకచింతకొమ్మ వంచి నారని ఒకచెయ్యికి త్రాడుకట్టి కొమ్మకుకట్టి వ్రేలదీసి విడిచిపోవుండగా క్రిందితత్వమునుచెప్పగా మల్లెలగంగమ్మ మనుష్యరూపముతోవచ్చి బంధము విడిచినది. దొంగలకు కన్నులుకనపడక కష్టపడుతుండగా వారే తిరిగి వారికి నేత్రములు అగుపడునట్లుచేసి బుద్ధిచెప్పిపంపినారు.

తత్వము

వాలావాలాలువాలలమ్మ మల్లెలకొండ మాలేగంగనుచూడరమ్మ వాలవాల యీలాగుదేహమున మెలుగవెలుగె మాలోగంగకు ॥వా॥ మొలుకులమేడ జొచ్చెనమ్మ తలుపూలుతీసి మొలుకనవ్వులునవ్వెనమ్మ కులుకుచుమొలుకుచు తొలకరిరూపై పలుకులువలికె పరంజ్యోతికి ॥వా॥ బొట్టుబోనాము పెట్టరమ్మ కట్టడిఖర్మపిల్లను బలిపెట్టరమ్మ సూటివీధులను

సూటిదప్పకను సాటిలేని గురుపీఠముమీద ॥వా॥ యేడుమేడాలు జొచ్చె నమ్మ మనవాడల్లోన జోడుహంసలుకూడెనమ్మ కూడిపాడి మన వాడ నిధులలో బాలులతోకూడాడినతల్లికి ॥వా॥ నాటకధరుడుయితడోయమ్మ నారాయణబ్రహ్మం కోటితేజాము చూపెనమ్మ అంచిఆత్మలోపొంచి చూచి తెమ్మంచిదయా శివపోతులూరుహరి ॥వా॥

వ చ న ము

వేంపల్లే సంతకు గంతయద్దును తోలుకొనుపోవుచు గేట్లువానికి సుమారు 1. 2. ఫర్లాంగ్సుదూరములో అగుపించి తిరిగి గేటుదాటి 1 ఫర్లాంగు దూరములో అగుపించుతూ గేటు యివ్వకుండాపోతూవుండినారు ఒకరోజు తన మాహాత్యమును చూపదలంచి గేటువానికి చిక్కగా యిన్నిదినములు విసిగి వున్నందున మధ్యాహ్నపు యండలో యండకాలం యేటిలో కాలుచుండు యిసుకలో కోలుకొంకురాయి వెసివిసువగా యీ క్రింది తత్వముచెప్పినారు. యద్దులకొండ్రాయుసు. గండి శ్రీఅంజనేయులు వచ్చి యిడిపించిపోయినారు.

త త్వ ము

అరెగోవిందా అరేమైతేరహువారె హరినారాయణ్ అరెగోవిందా అరెగోవిందా తుజారెగోవిందా భారంతేరాహెూనారె భావతీతమందు బయులుజేశి శివయోగికర్ బోల్ రెగోవిందా ॥అ॥ ముందుఅయిదటబట్టి మందిరంబునమీ జడకోనల్లాకుజానారే జూటమూర్తి వుచ్చాటనచేశి బాదు యేక్ బాత్ బోల్ రెగోవిందా ॥అ॥ అల్లాతూరసూలుల్లా కర్ కర్ ముల్లా హెూ కోఖడ్యాహురెగోవిందా ॥అ॥ పంచభూతముల అంకెనవేసుక ఘీంకార



ాదెకు చడ్యాహురె అందాములోపుల గండిహర్మార్ అనందయెక్ త్ బోల్ రెగోవిందా ॥అ॥ ఏక్ దో తీన్ చారొకెబీచమ పాంచోకల్మ ్యాహురె వద్దుకనాలోనయద్దలకొండాయ ముద్దుగయేక్ బాత్ బోల్ రె విందా ॥అ॥ నారాయణవేద పారాయణహాంకు కారణగురువుహెూ ారే మహమ్మదునెప్పాడు. మరవకనేతలతు మాయపుశివపోతులూర్ రె విందా ॥అ॥

వ చ న ము

యినగనూరు గ్రామముల్లో గంగజాతర జరుగుచుండ గ్రామంలోని వకులందరుచేరి కోలన్న వేయుచుండినారు. శ్రీవారు అచ్చటకి పోయి యనా నేనుకూడ కోలన్న వేసెదను అని అడుగగా వారు నీవుముసలివా క్రిందపడి నలుగుతావని హేళనగావింప యింకొక వీధికిపోయి చిన్నచిన్న ిల్లవాండ్లను జమచేసి దంట్లుయిరచి వారికి కోలన్నవేయుటకు కట్టెలుగా ిచ్చి తాను తాళమువేయుచుండగా ఆ పిల్లవాండ్లు యవ్వరుచూడని వింతగా దవారికన్నను యెక్కువగా కోలన్న వేయుచుండ గుడిలోని గంగమ్మ విగ్ర ముపచ్చి వీరిదగ్గరచేరినది తర్వాత అక్కడచూచుకొని గంగమ్మ యేదిరా ని చాకలవాని మర్దించి విచారించగా యిక్కడవున్న సంగతి తెలసి వచ్చి ిమించకోరగా యిక్కడనే గుడికట్టి జాతర చేసుకొమ్మని చెప్పినారట అప్ప నుంచి అదేప్రకారం జరుగుచున్నదట.

త త్వ ము

జోగోజోగనరె ఆకల్లా జోగో జోగనరె
ోగోజోగ ని యోగాంతప్పక యినగనూరిలోన యీదిపెద్దమ్మకు ॥జో॥

పరతత్వమార్గమున పరమనేవస్తువు యిరువులుచూ పెటి యాలోకమాతకు ॥జో॥ దృష్టదున్నను బట్టి నిష్టతో ఖండించి సృష్టీపాలన చేశె దృష్టిదైవానికి ॥జో॥ వేదాంతసారమున వాదింతుత పెప్పట ఆదియోగమునందు ఆగజయానకు ॥జో॥ యేటికి అవలవెలిటిజ్యోతికి సూటితప్పకుండ సాటి ముద్దలు పెట్టి ॥జో॥ నారాయణనెకొమ్ము పారాయణముచేశి సార్థాంశివ పోతులూరుసాగరునకు ॥జో॥

కడప జిల్లా చాపాడు మండలం వ చ న ము

అన్నవరం గ్రామంలో సుబ్బిరెడ్డి అనునొక శిష్యుడువుండినాడు అప్పటికి పోయినప్పుండంతయు తనయింటియందెవుంచుకొని శుశ్రూషలుచేసూ వుండినారు ఒకప్పుడు పోతులింగస్వామి ప్రతిష్ట చేయించయిచ్చకలవాడై చేయించుచుండ శ్రీవారు అక్కడికి పోయినారు అప్పుడు అక్కడ జరుగవలశిన పనులన్నియు నెరవెర్చుచూ తానుమాత్రము గురుశేవయందెవుండినారు అప్పుడు బ్రాహ్మణులందరు యేకమై మనము ఇక్కడవుండడము యవ్వరినో తురకవానిగురుగా భావించి శేవించుకుంటూ వున్నాడు ఇక్కడభోజనముకాని ప్రతిష్ఠకాని మనకు అవసరములేదని వెళ్ళిపోదామని సుబ్బిరెడ్డిగారిని దూషించిపోవలయునని సంకల్పించుకొని అడుగగా వారు స్వామి మీపనులు మీరు నెరవెర్చండి నేను ఇచ్చటవుండిననేమి మీకు యేకొరతయు లేకుండా చూచుచున్నానని మనవిచేయుచున్నాను వారువినక మొండిపట్టుదలగలవారైయుండినారు అప్పుడు శ్రీవారు క్రింది వ్రాసిన తత్వముచెప్పగా ప్రతిష్టించిన రాతి పోతులింగస్వామి విగ్రహము రెండు వప్పులుగాచిలీ ఇప్పటికివున్నది చూడవచ్చును.



త త్వ ము

[illegible] [illegible] దును వీపున కెవ్వరుండుదనన్న [illegible] ॥దీ॥ పుట్టినప్పుడే మాటలాడును పట్టెడేశివెన్నతినును. పట్టులేక పెరుగుసన్న మాటలో పడిపోవును ॥దీ॥ తల్లితండ్రినికానవన్న తపసైతానుండును యల్లలోకములేలుకుంటూ యేడుగురితోనుండునూ ॥దీ॥ పరమపథము చూచితినన్న భ్రాంతిలేకపోయెనన్న భ్రాంతిరహితమైన గురునిపదములోజెరితినన్న ॥దీ॥ చక్కని శివపోతులూరుస్వామిని మీ రెరుగరన్న ॥దీ॥ వక్కడె నారాయుడన్న పెక్కు మతములు లేవ్వరన్న ॥దీ॥

త త్వ ము

అందమయినపూలు అందెకోతాను యిందుమహమ్మదు యాశగంధమూ కొమ్మబంగరుపూలు కొయ్యబోదామా ॥అం॥ అందముగకమలమునడుమను బిందుకళలనుపొంది ఆత్మలోఅంది అందనిహంసతోను పొందుగా పేనుగొండలోనా ॥అం॥ పదహైదుయపుడుబారితిరుగుచును అదమాత్యాయీరెండు అడుచుండగను పదిలముగా గురుపాదపద్మము వదలకను యేవేళఆత్మలో మధురమైనరసముతీపు మరవక పెనుగొండలోనా ॥అ॥ యిరవయియీఅయిదు యిమడియుండగను అరలేక ఆ ఆరువేకుంశేయగనూ అరశి అర్థువై ఆరుయనమిదివరచి చూచితె మూటతెరచి సారమైన బ్రంహ్మపదవిస్తారముగ పెనుగొండలోనా ।అం। ముప్పాయిమూడు కోట్లమునులు యుండగను. యప్పుడు యేవేళయడతెగకను పాపచూపులలోపులాను ద్వీపమై నారాయణయ్య అప్పుడు శివపోతులూరు యప్పుడు పెనుగొండలోనా ॥అ॥

## తత్వము

ఎవ్వరో శివా శబ్దమైనదని ఓంకారమేదిరారోరి ఘటముగ్గారి కూటభ్రూమధ్యమందున్న వాడెవ్వడో చూడరోరి ॥ఒ॥ ఆ అలుయనమిది అక్షరంబుల కాదిహారుడెవ్వడో చూడరోరి అకారమును విలుకహంసతో కూడుకొని అడించుచున్నాడురోరి ॥ఒ॥ కాఖాలుపదిరెండు పర్వములు జేసుకొని కన్నుమూసుక చూడరోరి కలరేకులైదునా కాంతవకటున్నది కరకంఠుడెరుగురారోరి ॥ఒ॥ తాధదభయనె తత్వముసుతానెరిగి తలుపు తీసుకచూడరోరి తెరతేరుకాడునై దేవాలయములోన తేటగానున్నాడు రోరి ॥ఒ॥ యరలవా నారాయణ పరబ్రంహ్మరుద్రుడెవ్వడో చూడరోరి శెషసహాయనె శివపోతులూరయ్య సాక్షిగానున్నాడురోరి ॥ఒ॥

## తత్వము

భక్తులారా యిటురమ్మని ననుపై పట్టి పిలుచుకొనెనె ।ఓభక్తులార। ముక్తికిమూలాధార చక్రమిది మొదటి ముద్రయనెనె ॥భ॥ సాంఖ్యల న్నియునుదీరె మొదటికిని సాంఖ్యంబిదియనెనె అంకురమైనది తారక యోగము ఆశలుడుగుమనెనె ॥భ॥ కుదురుజేసితె రెచకపూరక కుంభక మిదియనెనె మదిగల్గినదె షణ్ముఖిముద్రకు మూలంబిదియనెనె ॥భ॥ వాడలెల్లశోధించి చూచితె వైభవమిదియనెనె, నడినాళంబునకేచరిముద్ర కు నాదంబియనెనె ॥భ॥ ముద్రలన్నియునుదీరె మొదటికిని మూలంబిది యనెనె భద్రమైనది శాంభవి ముద్రకుభావంబిది యనెనె ॥భ॥ మనసు లోన నారాయణ బ్రహ్మంతానె తాననెన స్వానుభూతి శివపోతులూరయ స్వామియితడనెనె ।భ।



## తత్వము

యెక్కడిలింగమన్న యికదెక్కడిలింగం యీయన జంగాము డె దిక్కైనగురుడోయమ్మా ॥య॥ నానాభేదాములనావి వేదములెపాటి శి నాదము యినుపించుమంటె శివన్నాదము యినుపించెమాకు ॥య॥ బొమ్మిదివాకిండ్లుమూసి దివ్యలింగం తలుపుతీశి కవ్వమాలెతిరిగెటి మా వ్వురి చెన్నునిజాపెక ॥య॥ భక్తియుక్తిముక్తితోను భావనారాయణ బ్రహ్మం సత్తెనశివపోతులూరు స్వామినీమదిలోనదలచెక ॥య॥

## వచనము

తుడుములదిన్నె గ్రామములో మహామంత్రవెత్త శక్తిస్వాధీనపరురాలు ప్రజలను హింసలు పెట్టుచుండెను. వుశేనయ్యా గారు దారినపోవుచుండగా గ్రామప్రజలు అమ్మా పెద్దలువచ్చుచున్నారు అనిచెప్పి రానిమ్మని దగ్గరికివచ్చి ంతనే నీవుపెద్దవట యెహోపాటలు చెప్పెదవట యేది నీపాడెలోపాట వకటి ప్పమని క్రిందవ్రాసిన తత్వము చెప్పగా కనిగుడ్లు బయిటికివచ్చి చనిపో నది.

## తత్వము

ఝుడియకనేనొస్తి తుడుములదిన్నెజొస్తి నడిమివాకిలితీస్తి నాగేం మునిలేపిసూస్తి కోలన్నకోలుకోలె కోలన్నకోలుకోలె.

నాకటపోకటచూచి నేవాకిట రాటంపెడితి వానగాలివచ్చె నేవాకిలి కాన డితి ॥కొ॥ మధ్యానప్పటియండ మావూరిరచ్చబండకాసుకొక్కదండ

కలంగెనెను గొండ ॥కొ॥ యత్తితిరాజంతా మాపేటినరులకంద్ల పూస్తి [illegible] ॥కొ॥ [illegible] ॥కొ॥ [illegible] ॥కొ॥ [illegible] నారాయణ బ్రహ్మం వల్ల ॥కొ॥ నమ్మినవారికాయ నారాయణ బ్రహ్మంమాయ సృష్టిలోటి మాయ శివపోతులూరుకాయ ॥కొ॥

పుశేనయ్య వక్రతోవన పోవుచుండగా భగవంతుడు అయనను పరీక్షిందలచి పులియై త్రోవ నడ్డగించి బెదరింప యీ తత్వమును చెప్పినారు.

హర హర నీవుచేసిన పనులన్ని హరునిభక్తులకు తెల్పుదునా రాపుజేసి మమ్మురక్షింపకుండిన రవ్వజేసి రట్టుబెట్టుదునా ॥హ॥ కరుణతో మాదిగెదూడయ్య యింటిలో కరుకుట్ల ముచ్చటతెల్పుదునా శరణులరమ్మని పంజులలోమమ్ము చేరమన్న సుద్దితెల్పుదునా ॥హ॥ కుమ్మరగుండయ్య ఘనునియింటికిపోయి కోలువుతీరినసుద్ది తెల్పుదునా రమ్మనిపిలుచుక కైలాసదిరిమీద రహస్యమాడినసుద్ది తెల్పుదునా ॥హ॥ బళ్ళాణరాయుని యింటికినిపోయి భార్యనడిగినసుద్ది తెల్పుదునా వేళ్ళుముడుచుకోని కాళ్ళుతన్నుకుంటూ పాలుత్రాగినసుద్ది తెల్పుదునా ॥హ॥ చిత్రముశిరితొండ భక్తునింటికిపోయి కూరకుడిచినసుద్ది తెల్పుదునా వినయార్ధంబుగ యిప్పుడారగించి యిట్లురమ్మన్నసుద్దినే తెల్పుదునా ॥హ॥ బోయకరణప్ప యింటికినిపోయి పొత్తుగుడిచినసుద్ది తెల్పుదునా ఘీంకారములబట్టి క్రిందుమీదుజేశి కీలుతెల్పినబుద్ది తెల్పుదునా ॥హ॥



మేదరీనందయ్యగారు మిమ్ము మమ్ము అదరించినసుద్ది తెల్పుదునా బోదించియిప్పుడు పుణ్యలోకమునకు పొమ్మన్న సుద్దినె తెల్పుదునా ॥హ॥ మడియాల మానందీసుయింటికినిపోయి మాటలాడిన సుద్దీతెల్పుదునా యెయ్యాడంబున అప్పయ్య పూజచేసి అనతిచ్చినసుద్ది తెల్పుదునా ॥హ॥ నారాయణ వేదపారాయణయని నమ్మియున్నసుద్ది తెల్పుదునా సారాం శివపోతులూరు సభవారికి ఘనులుజేర్చిన సుద్దితెల్పుదునా ॥హ॥

తత్వము

నారాయణనరాదా పాపపుజిహ్వ నారాయణనరాదా నారాయణనరాద నోరునాలుకరాద భారముగనుయీదలేవు బ్రహ్మపదవినంటలేవు ॥నా॥ యింటిలో శోధించలేవు మూటిమునునానిల్వలేవు హితపతుర్లయిడువలేవు హితవుత్తానై తిరుగలేవు ॥నా॥ కడచిగంగను కలువలెవు పలచపల్లెచేరలేవు జంటపాపనంటలేవు జన్మరహితము యిడువలేవు ॥నా॥ పలికియమునితో బొంకలేవు ఫాలమందునచేరలేవు ఘనసుమాయతెలియలెవు మహమ్మాదునంటలేవు ॥నా॥ సాకెకను సేవించలేవు శరణసినీవు నిల్వలేవు శేషకుని సేవించలేవు శివపోతులూరునంటలేవు ॥నా॥

పుష్పలూరు మాదిగె అయిన శ్రీ పుశేనయ్యగారి శిష్యుడు
చెప్పిన తత్వము

కొమ్మనపుట్టెర ఘుమ్మనినాథం కుడురాయెనా కొమ్ముగురువులకు హెచ్చుమోతాదుల కిరువాయనాకొమ్ము అక్షయమున్నది ఆకొమ్మెరాశివాతాలిల్లె లిల్లెలో ॥కొ॥ నాకత్తి మంచిది నల్లనిబాయది నమ్మినవారికినాకత్తిరా మూలమయినకత్తి మోక్షానికికత్తి కాదన్ననోటికి గాలంరా శివతాలిల్లె లిల్లెలో ॥కొ॥ పుష్పలూరిలోన పురిమితిరాశివా పుగముజగము రెండు వక్కటిగా వప్పలకుప్ప మా తప్పులుకాయలె అప్పుడురా పుశేనపుడురా శివతాలిల్లెల్లేలో ॥కొ॥

శ్రీ వుశేనయ్యగారి శిష్యులు వెంకటగిరి దగ్గర మనులాలాపేట
పేటలో జీవసమాధి అయిన దేవాంగవంశ సంభూతులగు
గౌరాబత్తిన రుద్రమూర్తిగారు చెప్పిన

## పద్యములు

1. జగమెల్ల తీనయ్య సంగతివున్నది
సంగతిగన్నట్టి సరసులకును
రంగుగావెలుగులో రంజిల్లుచుండును
వీరపుసేనయ్య యీశ్వరాయా

2. రాజేయుగురుస్మరణ రాత్రిరిపగలును
భజనయామరకున్న భాగ్యులకును
ఆంజవేసిఘనము ఆలీరుకన్నట్టు
వీరపుసేనయ్య యీశ్వరాయ

3. కన్నులపైగాను వున్నదిగోప్యంబు
మిన్నుజూచినీవు మేనుమరచి
తిన్నగానుమాటు తీసితేపొరుకును
వీరపుసేనయ్య యీశ్వరాయ

4. వద్దనేవున్నది వద్దికెత్తోచూడండి
పెద్దలనుసేవించి బుద్ధికలిగి
కద్దులేదనురాదు కైవల్యమియుగొండి
వీరపుసేనయ్య యీశ్వరాయ

5. పరగుచునుండును పరగవిశ్వంబెల్ల
నిర్భయంబై యుండు నిర్మలముగా
అద్భుతంబైనట్టి ఆనందయోగంబు
వీరపుసేనయ్య యీశ్వరాయ



6. ఆనందమైనంత అన్నిటనుండురా
అంతరైవిజయమై అలరుచుండు
నిత్యమై సత్యమై సుస్థిరంబై యుండు
వీరపుసేనయ్య యీశ్వరాయ

7. అజ్ఞానిసుజ్ఞాని అనంది తెలియండి
సుజ్ఞానిభావంబు సుస్థిరంబు
అజ్ఞానిభావంబు అంధకారంబయా
వీరపుసేనయ్య యీశ్వరాయ

8. వేమనవాక్యంబు వేదసారముసుమ్మీ
హంసోహమనెడి హోంకారమునను
హేమతారకమైన వెలుగునుగనవలె
వీరపుసేనయ్య యీశ్వరాయ

9. అంటిఅపజ్యోతి అహర్నిశముసుండు
మింటభానుని కిరణములరీతి
చుట్టుకొనిగురుదృష్టి సూటితప్పకనుండు
వీరపుసేనయ్య యీశ్వరయ

10. కైవల్యమెందుండు కన్నులనుండును
రవిచంద్రకళలతో రమ్యముగను
భవనాంతరంబుల ప్రబలుచుండును
వీరపుసేనయ్య యీశ్వరాయ

11. పాదపదంబులవి వేదసారంబెతికి
అది భూమధ్యమున అంటిపెనగి
ముదముతోముమ్మూల మోక్షంబుగనరయా
వీరవుశేనయ్య యీశ్వరాయ

12. నయనమధ్యమందు నిలిచియున్నాడయా
మాయతెలియనీక మోసపుచ్చి
మైదుబ్రహ్మమాయ మరియాదతేకున్న
వీరపుశేనయ్య యీశ్వరాయ

13. మంచికన్నులైతె మోక్షంబుకల్గును
పొంచికొట్టవలె పంచభూతములను
వంచనపరులైతె వచ్చిపోవలెనయా
వీరవుశేనయ్య యీశ్వరయా

14. సోధించిసోహమున భేదించికుండలిని
పాదుకొనినిటలమున జయులుపలచి
వెదరకచూడుడీ చేకూరుమోక్షంబు
వీరపుశేనయ్య యీశ్వరాయ

15 కామక్రోధంబులు కడతేరనియ్యవు
పామరంబునదోసు పాతకములు
కామమునుఖండించి కడతేరవలెనయా
వీరవుశేనయ్య యీశ్వరాయ

16. దాటేదియేలాగు దేహగుణములుమెండు
మాటుపెట్టివాటి మర్మమెరిగి
మాటుతీసితుదను మర్మంబుగనవలె
వీరవుశేనయ్య యీశ్వరాయ



17 చోటుతెలియలేదు శాస్త్రంబుచదివేరు
వట్టిమాటలాడి వదురుకుంట
పట్టినామము పెట్టి ఫలమేమికద్దయా
వీరవుసేనయ్య యీశ్వరాయా

18. పట్టెనామముపెట్టి పలుపరించినలేదు
బుట్టనెత్తినపెట్టి పరుపులెత్తి
పట్టిభుజమునబెట్టి పొందికలుచెప్పేరు
వీరవుశేనయ్య యీశ్వరాయ

19. పొందికెలుచెప్పేరు పుణ్యమేమియులేదు
పందమానవులెల్ల పొట్టకొరకు
కుదురుగాగురుభోధ చూడసెనరుగదా
వీరవుశేనయ్య యీశ్వరాయ

20. ఆనందమెప్పుడు ఆత్మలోపలనుండు
ఆత్మయందును తన్నుతానుతెలసి
వనరుగాతేజమున యనసియుండగలేరు
వీరవుశేనయ్య యీశ్వరాయ

21. పక్కప్రొద్దుయని వుపవాసములువుండి
ఆకుఅలుములుతిని అడవులందు
మేకవలెమేసేరు మూర్ఖులందరుయిల
వీరవుశేనయ్య యీశ్వరాయ

22. క్రమముతెలియగలేక గాశిపడితిరిగేరు
భూమిచరియింతురు బుద్దిమాలి
సోమపానముజేసి సుఖముతెలియకలేరు
వీరవుశేనయ్య యీశ్వరాయ

23. సుఖముతెలియగలేక వచ్చిపుట్టుదురయా
దుఃఖజలరాశిలో మునిగితేలి
హంకారమునెముల్లు అంగిటనున్నది
వీరవుశేనయ్య యీశ్వరాయ

24. దీపంబుయలిగించి చీకటినితొలగించి
చూపురూరులేని మర్మమెరిగి
చూపురూపునుగలసి చొక్కుండవలెనయా
వీరవుశేనయ్య యీశ్వరాయ

25. సొక్కుండవలెనయా సురాపానమునఃజేసి
వక్కడేయుండును వద్దనిలచి
దిక్కెవ్వడనులేడు దేవుడొక్కండయా
వీరవుసేనయ్య యీశ్వరాయ

26. చేరకలశితిగదా చేష్టలన్నియుమాని
నిరతసామాధిలో నిలచియుండి
యరుకగరిగినచోట యేకమైయుంటిరా
వీరవుసేనయ్య యీశ్వరాయ

27. అష్టమదములు ఆగామిసంచితములు
అష్టమూర్తులు మరిఆమరియుండు
అష్టభూతములను ఆరుమతములునాయె
వీరవుసేనయ్య యీశ్వరాయ

28. సతిపతి నెడబాపు సద్గురుడతడౌను
ఆ కామవీర్య మాయకులము
గురువుమొదలాయెను కొనలెల్లకులమాయ
వీరవుసేనయ్య యీశ్వరాయ



29. యోనిలోనెవ్వరు వైపుతెలియగలేరు
యోనిలోపులమాకు వై పుతెలుసు
యోనియోనియని యదపడిగిట్టిరో
వీరవుశేనయ్య యీశ్వరాయ

30. యోనిప్రజాపతికి యదపడియున్నది
యోనికి కామము యేపుమీర
యోనికామముసందు యీనుడుయున్నాడు
వీరవుశేనయ్య యీశ్వరాయ

31. యోనిలోనెపుట్టె యేడేడుభవనాలు
యోనిలోనెవెడలె అఖిలజగము
మానాభిమానములు మర్యాదలాయెను
వీరవుశేనయ్య యీశ్వరాయ

32. చెల్లెలికికూతురుకు తల్లికిమొగడాయె
కల్లగానునిజము క్రమముతోను
అలరుచుఅందరికి అనుభవంబాయెను
వీరవుశేనయ్య యీశ్వరాయ

33. ఆలుమగడగూడి చేరికతోనున్నపుడె
కలశిబందువుకూడి క్రమముతోను
వెడలివచ్చినపుడు ఆలుయమ్మాయను
వీరవుశేనయ్య యీశ్వరాయ

34. ఆలుఅమ్మాయను అమ్మఆలాయను
ఆలుఅమ్మయని అదితెలసి
ఆలుఅమ్మెవ్వరొ అదితెలియగావలె
వీరవుశేన్నయ్య యీశ్వరాయ

35. ఆలుఅమ్మాయను ఆక్రమముతెలియండి
తల్లిభావసమనసు తగలివుంటె
తొలగునుదోషంబు తెలిసినవారికి
వీరప్పసేనయ్య యీశ్వరాయ

36. తెలిశినవారికి తేటగామోక్షంబు
తెలిశితనలోనున్న తత్వమెరిగి
యల్లవారినిల అమ్మాయనిలనబాయు
వీరపుసేనయ్య యీశ్వరాయ

37. అమ్మయనిపిలిచిన అణుగునుదోషంబు
అమ్మయనిపిలిచితె హానిలేదు
అమ్మమహమ్మయి అందరిలోనుండు
వీరపుసేనయ్య యీశ్వరాయ

38. అందర్లోనుండు అవందమైయపుడు
సందేహములువీడి సర్వంబుగనుడి
యెందెందుచూచిన అందెందుయున్నది
వీరపుసేనయ్య యీశ్వరాయ

39. అందెందుపున్నాడు యందుచూచినగాని
హృదయాంతరంగుడై వెలుగుచుండు
అందికలసినవాడె అతడెపరశివుడయా
వీరపుశేనయ్య యీశ్వరాయ

40. అతడెపరమశివుడు అతడె త్రిమూర్తులు
అతడెఅందరియందు అలరుచుండు
అతడెపో పరబ్రహ్మఅతడె
వీరపుశేనయ్య యీశ్వరాయ



41. అతడెవీరవ్వశేసు యితరులెవరున్నారు
అతడు కానిదియేమి వకటిలేదు
అతడెఅన్నిటనిండి అన్నితానై వాడు
వీరవ్వసేనయ్య యీశ్వరాయ

42. అంతతానై వాడు యినుమంతలేకుండ
యింతఅన్ని మాయచేష్టలాయె
అతిఘోరవిషయములు అపరిమితమాయెను
వీరవుసేనయ్య యీశ్వరాయ

43. మాయమరుపెనయా మాయప్రపంచంబు
మాయమాయజేశి మహిమతెలశి
మాయమాయమాయ మాహిమ్మాయగదరాయో
వీరవుసేనయ్య యీశ్వరాయ

44. మనసుపదిలముజేశి మనసుతాతెలసిన
మనసులోనున్నట్టి మహిమగన్న
మనసుపరంజ్యోతి మనసుపరమాత్మయా
వీరవుసేనయ్య యీశ్వరాయ

45. మనసుకు ముగుడాడు మరుకుండావేశి
పూనిత్రికోణ మార్గముపొందుతెలసి
పూసివెన్నలలోని బయలుగనవలెనయా
వీరవుశేనయ్య యీశ్వరాయ

46. బయలుబయలేనయా బయలెల్లబ్రహ్మంబు
బయలులోని బయలుబరుగుచుండు
పాయకయేవేళ ఫాలమందుననుండు
వీరవుశేనయ్య యీశ్వరాయ

47 తాంమ్రమణ్యశిలా దారురూపంబుల
పామరంబునపూజ బ్రాంతివేయు
నామరూపంబులు నష్టంబుతాగదా
వీరవుశేనయ్య యీశ్వరాయ

48. నేర్పుతోనెప్పుడు నోరునాలుకలేక
తప్పక గురుస్మరణ తగిలియుండి
చూపుగానిచూపు సూత్రంబుగనవలె
వీరవుశేనయ్య యీశ్వరాయ

49. సూత్రంబుగనవలె చూపులోనిచూపు
నేత్రంబులోపలి నయముతెలిశి
అతీతమైయుండు అగోచరంబిది
వీరవుసేనయ్య యీశ్వరాయ

50. అగోచరంబై యుండు యెదుటరూపములేక
పగలురేయిలేని పట్టపగలు
నిర్గుణనిరభ్యాస నిర్భిన్నమైయుండు
వీరవుశేనయ్య యీశ్వరాయ

51. నిర్భిన్ననిష్కళ నిర్వాసమైయుండు
నిర్భాగనిస్సత్వ నిస్సంగమైన
నిర్భేదనిరాలంబ నవనీతమైయుండు
వీరవుసేనయ్య యీశ్వరాయా

52. నవనీతమైయుండు నాలుకయొగబెట్టి
శివధ్యానమేవేళ చేయవలెను
యేవేళనడపక అంతస్సునుండునా
వీరవుశేనయ్య యీశ్వరాయ



53. అరూపమున నెప్పుడావర్ణమైయుండు
నిలిచినయాకృతి నిండియుండు
యరుకమరుపులేని యరుతతానై యుండు
వీరవుశేనయ్య యీశ్వరాయ

54. యెరుకలోనియరుక యేకస్వరూపంబు
నయనమందున విశ్వమెల్లయుండు
విశ్వంబుతెలిసిన తేజప్రకాశమౌ
వీరవుశేనయ్య యీశ్వరాయ

55. తేజరిల్లుచునుండు తెజప్రకాశమై
రంజిల్లుచుండును రాత్రిపగలు
అజపసంయోగంబు అంటిపాయకనుండు
వీరవుశేనయ్య యీశ్వరాయ



## మంగళహారతి

కరతలా ముకముగ కలశి భ్రూమధ్యమున యిరువుకొని యేపే యింపుతోను పరమచిత్కళలంట పాటింవిహారతులు పదిలముగ కాళాస్త్రీ పరమేసునకు జయమంగళం నిత్యశుభమంగళం.

లాలితా నందలోలుడై నిటలమున వాలలాడుచున్న పరయో గికి జాలలైయలిగేటి బా [illegible] నకు [illegible] లలోన కాళాస్త్రీ యీసనకున ॥జ॥

ఆదిఅత్యంబైన [illegible] మధ [illegible] అరలేనిపరిపూర్ణ అ అవ రునకును పాదుకొనిఫాలమున ప్రజ్వరిల్లుచునున్న ముదముతో కాళాస్త్రీ మహాత్మునకు ॥జ॥

అక్షరంబులకాది అక్షరము పఠింపంచి దక్షణాభూలోకరక్షక నికి దక్షణాకైలాస ధరణిలోకాళాస్త్రీ అక్షయంబుగ వీరవుసేనయ్యక ॥జ॥

క్వాలిటి ప్రింటింగ్ ప్రెస్, బద్వేల్